# గోత్రప్రవరచంద్రిక.

(సమస్త విప్రశాఖల గోత్రములు, ప్రవరలు)



*

సంకలన కర్త, ప్రచురణ కర్త.

'విద్వాన్'

ముసునూరి వెంకటశాస్త్రి

(విద్యార్థి కల్పతరువు, శబ్దార్థదీపిక వగైరా
గ్రంథముల రచయిత)

*

రాజమండ్రి ] 1967 [ వెల 0-50

# గోత్ర ప్రవర చంద్రిక



బ్రహ్మకల్పమునకు 14 గురు మనువులు. ప్రతిమన్వంతరమునకు ఇంద్రుడు, దేవతలు, సప్తర్షులు మారుచుందురు. బ్రహ్మదేవుని 51వ సం॥ ప్రారంభదివసమగు ఈ శ్వేతవరాహకల్పమున స్వాయంభువ, స్వారోచిష, ఉత్తమ, తామస, దైవత చాక్షుషులను ఆర్గురు మనువులు గడచిరి. ఏడవవాడగు వైవస్వతమనువు కాలము జరుగుచున్నది. ఈతని అధికారమునగల సప్తమహర్షులు అగస్త్య, భృగు, అంగీరసులు చేరి పదిమంది గోత్రకర్తలయిరి. వీరిలో పుత్ర పరంపర శిష్యపరంపరల ననుసరించి గోత్రములు, ప్రవరలు ఏర్పడుచున్నవి.

అధ్వర సూత్రకర్తలు 7 గురు, హోత్రసూత్రకర్తలు ఇద్దరు కలిసి గోత్రప్రవరశాస్త్రకర్తలు 9 గురు అయినారు. గోత్రములు 2463 న్ను. ప్రవరలు 76 న్ను కలవు.

గోత్రకర్తలు:—(1) విశ్వామిత్ర (2) జమదగ్ని (3) భరద్వాజ (4) గౌతమ (5) అత్రి (6) వశిష్ఠ (7) కశ్యప (8) అగస్త్య, (9) భృగు (10) అంగిరసుడు.

మొదటి ఏడుగురు సప్త మహర్షులు: 8. 9, 10 అను వీరి సంతతియందు జనించిన మంత్రద్రష్టలుమాత్రమే ప్రవర ఋషులుగా ఉందురు.

అధ్వర సూత్ర కర్తలు:— ఆపస్తంబ, బోధాయన. సత్యాషాఢ, హిరణ్యకేశీయ, భారద్వాజ, వైఖానస. అగ్నివేశ్య, కాత్యాయనులు.

హోత్ర సూత్ర కర్తలు:— ఆశ్వలాయన, సాంఖ్యాయనులు.

మంత్ర ద్రష్టలు:— పెక్కు జన్మలయందు ఎడతెగక వేదాధ్యయనము, తన్మంత్రార్థానుసంధానమువల్లను. తపనుష్ఠానమువల్లను తాదాత్మ్యము పొంది పిమ్మటి జన్మలయందు గురుముఖమున అధ్యయనము చేయకయే పూర్వము అధ్యయనము చేయఁబడిన మంత్రములు బ్రాహ్మణములు ప్రత్యక్షమయిన మహాత్ములు.

ప్రవర:— తమ బంధువులగు ఋషుల పేర్లు చెప్పుకొని శ్రౌతాగ్నిని (వరించుట) ప్రార్థించుట. హవ్యమును స్వర్గమునకుఁ గొనిపోవు అగ్నిదేవుని తమ పెద్దల పేరుతో వర్గనాయకులను (ఆహ్వానించుట) స్మరించుటే ప్రవరము.

1. గోత్రము:— మూలపురుషుఁడు, కూటస్థుఁడు. ఆతని సంతతివలన కలిగిన పుత్ర పౌత్రాదిపరంపరలోనివాఁడు. ఏ ఋషివంశీయులు ఆ ఋషి గోత్రీయులమని చెప్పుకొనుచున్నందున సంతానమని సారాంశము.

2. గోత్రములు:— 2463 కలవు.

3. ప్రవరఋషి నామములు విడిచి కేవల గోత్రము ఒక్క పేరుమాత్రమే చెప్పవలెను సకారము చేర్చనక్కర

లేదని పలువురు పూజ్యులు చెప్పినందున సవర్ణము విడిచి వ్రాసితిని.

4. ఒక్కొక్క గోత్రమునకు ఒక్కొక్క ఋషితో కూడిన ప్రవర ఉండవచ్చును. అట్లే ఇద్దరు, ముగ్గురు, నలుగురు, అయిదుగురు, ఆరుగురు, ఏడుగురు ఉండుటయు కలదు. 4, 6, 7 గురు గల ప్రవరలు స్మార్తకర్మలందు మాత్రమే చెప్పుకోవలెను. శ్రౌతమున నిషిద్ధము.

5. ఒక్కొక్క గోత్రమునకు పెక్కు ప్రవరలను సూత్రకర్తలు విధించియుండిరి. ఒక్కొక్క ప్రవరను పెక్కు గోత్రములవారు చెప్పుకొనుచుండుటయు ఋషి నిర్ణీతమే.

6. ప్రవరల వికల్పము లెట్లు జరుగుచున్నను సూత్రకర్తలు ఆదియందు చేసిన నిర్ణయమునుబట్టి అనుశ్రుతముగా వచ్చుచున్నవే గాని వ్యక్తుల యిష్టానుసారము మార్చుకొనదగినవి కావు. ఋషులక్రమమైనను మార్పు చేయరాదు.

7. ప్రవర ఋషు లెల్లరు మంత్రద్రష్టలగు ప్రసిద్ధ ఋషులే. దేవతలని రాక్షసులని నామసామ్యమును బట్టి భావింపవలదు. కొన్ని క్షత్రియులపేర్లు కానవచ్చినను వారు అనితరసాధ్యమైన తపోమహిమచే జగత్ప్రసిద్ధులైన మహర్షులుగాను, మంత్రద్రష్టలుగాను భావింపవలెను.

8. గోత్రఋషి సామాన్యముగా మొదటనో మధ్యనో చివరనో కలిపి ప్రవర చెప్పబడును. ఆది మధ్యాంతముల యందు ఎచ్చటను గోత్రఋషి నామము కలియనంతమాత్ర

మాన ప్రవర తప్ప కాదు. ప్రవరయందు గోత్రఋషి చేర్చబడని గోత్రప్రవరలు వందలకొలంది కలవు.

9. ఎవడు తన గోత్రప్రవరర్షులనుమార్చి అన్యగోత్ర ఋషులపేర్లతో గూడిన ప్రవరను చెప్పి అగ్నిని వరించునో, ధర్మకార్యములు చేయునో వాని కర్మఫలము ఆఋషులకే చెందును, తనకు లభింపదు.

10 యాగాదులందుగాని, తర్పణాదికమునందు గాని నలుగురు పేర్లు చెప్పియు అయిదుగురుకంటె ఎక్కువ ప్రవర్షులపేర్లు చెప్పియు వరింపరాదు. ఆరుగురు, ఏడుగురు ఋషులు గల ప్రవరలయందు క్రింది క్రిందివారగు అయిదుగురిని మాత్రమే చెప్పవలెను. రాజు పురోహితుని ప్రవరను చెప్పుకోవలెను.

11. ప్రవర తెలియని విప్రుడు తన గురుని ప్రవరతో కాలము గడుపవలెను. సమస్త వర్ణములవారు గోత్ర ప్రవర జ్ఞానములేనపుడు 'మానవ' అను ప్రవర చెప్పవలెను.

12. సమాన గోత్రము, సమాన ప్రవరర్షులు, సమాన గృహనామము గల కన్యను వివాహము చేసికొనరాదు. ఈ నియమము నుల్లంఘించినవారి సంతతి నిర్వీర్యమగుననియు, వారికి చండాలత్వము సిద్ధించుననియు ఋషులనిశ్చితాభిప్రాయము.

13. గోత్రకర్తలలోను పుత్రపరంపర, శిష్యపరంపర అని రెండు విధములు కానవచ్చును. పుత్రపరంపరా ప్రవర

గల వధూవరుల గోత్రములందు ఒక్క ఋషి సంబంధము కలిసినను వివాహము నిషిద్ధము.

14. శిష్యపరంపరా ప్రవరలుగల వధూవరుల గోత్రములందు సగముకన్న ఎక్కువ ఋషులు కలియరాదు. అనగా ముగ్గురు ఋషులలో ఇద్దరు, అయిదుగురిలో ముగ్గురు, ఏడుగురు ఋషులలో నల్గురు కలిసినచో వివాహము దూష్యము. పంచార్షేయ త్రయార్షేయములందు ఏ ఇద్దరు ఋషులు కలిసినను సంబంధము పనికిరాదు.

ఒకే కుటుంబము, ఒకే ఋషిసంప్రదాయముగల స్త్రీ పురుషుల రక్తస్పర్శకలయిక అశాస్త్రీయము, దురాచారము, నిషిద్ధము కూడా. అందుచే బుద్ధిమంతులగువారు పెక్కు గృహనామములు, శాఖలు, గోత్రప్రవరలు తమవద్ద ఉంచుకొనుట చాలవిధములుగ లాభదాయక మగును.

సుమారు రెండువేల అయిదువందల గోత్రములు ఋషినిర్ణీతములై యున్నను సాధారణముగా వాడుకలో కానవచ్చునవి నూటయేబది మాత్రమే. ఆయాగోత్రములకు మాత్రమే యీదిగువను ప్రవర్షుల పట్టిక లివ్వబడుచున్నవి. ఈచిన్నిపొత్తమున అకారాది క్రమముగ ఇంటిపేర్లు, వారి శాఖలు, గోత్రములు, ప్రవర్షుల సంఖ్యలు, ప్రవరములు ఇవ్వబడును. ఒక్కొక్క యింటిపేరు వారు పెక్కుశాఖలయందును, ఒక్కొక్కగోత్రమునకు పెక్కు ప్రవరలును కానవచ్చుచున్నవి. శ్రద్ధతో గమనింపప్రార్థన.

ఇందు కేవలము సంకుచితబుద్ధితో ఒక్కశాఖకేగాక నియోగులు, వెలనాటి వైదికులు, తెలగాణ్యులు, యాజ్ఞవల్క్యులు, కోసలేయులు; వేగినాటి వైదికులు, మాధ్వులు ద్రావిడులు, వైఖానసులు మున్నగు బ్రాహ్మణశాఖలవారి యింటిపేర్లను గ్రహింప యత్నించితిని. అందుచే మొదటి ముద్రణము సమగ్రము కాకపోవచ్చును. మిత్రులు దయయుంచి ఇందు ముద్రింపబడని యింటిపేర్లవారి గోత్రప్రవరలు పోస్టుద్వారా తెలిపి సమాజమునకు ఉపకరింపగలందులకు వేడెదను. తప్పులున్న తెలిపినచో మలిముద్రణమున సవరించుకొందును. సోదర ప్రజానీకము దీని యుపయోగమును పొందగల్గినచో నాకృషి సఫలమైనట్లు తలంతును.

ఇట్లు— బుధజన విధేయుడు,

ము॥ వెం॥ శాస్త్రి.

## భృగుగణము

శ్రీవత్సకులోద్భవులగు జమదగ్ని సంతతివారికి త్ర్యార్షేయ పంచార్షేయములు చెప్పబడెను. 1. జమదగ్ని 2. వత్స 3. శ్రీవత్స, 4. చ్యవన, 5, ఆప్నవాన, 6. ఔర్వ, 7. సావర్ణి, 8. జీవంతి, 9. దేవరాత. 10. ఈశాయన, 11. జాబాలి, 12. వీర, 13 హిత్యవట, 14. మండు, 15. (ప్రాచీనయోగ్య. 16. ఆర్ష్టిషేణ, 17. అనూపకులు.)

వత్సలు, విదులు, ఆర్ష్టిషేణులు, ఆయాస్యులు, మిత్రయువులు, వైన్యులు, శునకులు వీరు ఏడు గణములు.

వత్సగణములో మార్కండేయులు, మాండూకేయులు మొదలగువారివి నూటరెండు వత్స గోత్ర భేదములు కలవు. వారికి శ్రీవత్స గోత్రప్రవర చెల్లును.

శ్రీవత్స
జామదగ్న్యవత్స } ప్ర. 1. భార్గవ, చ్యావన, ఆప్నవాన, ఔర్వ, జామదగ్న్య (5. ఆప)

,, 2. భార్గవ, ఔర్వ, జామదగ్న్య (3. ఆప)

,, 3. భార్గవ, చ్యావన, ఆప్నవాన, ఔర్వ, వైదల (5. అప.)

,, 4. భార్గవ, చ్యావన, ఆప్నవాన.

,, 5. భార్గవ, చ్యావన, జామదగ్న్య, వాత్స, ఆప్నవాన, ఔర్వ, వైదల (7. వైఖానసమతము)

☞ వత్సగణములో మార్కండేయులు మాండూకేయులు మున్నగువారి 102 వత్స గోత్రభేదములు కలవు. వీరందఱికి శ్రీవత్స గోత్రపరమే చెల్లును.

అజామదగ్న్యవత్స:- ప్ర॥ భార్గవ, చ్యావన, ఆప్నవాన (3. అశ్వ

బై (వై) ద;- ప్ర॥ 1. భార్గవ, చ్యావన, అప్నవాన, ఔర్వ, వైద (5. బోధా)

ప్ర॥ 2. భార్గవ, ఔర్వ, జామదగ్న్య (3. కాత్యా)

ప్ర॥ 3. భార్గవ, చ్యావన, ఆప్నవాన (మాత్స్య)

☞ విదులలో శైలులు, అవటులు అని సుమారు ఇరువది గోత్రములు కలవు. వీరెల్లరకు వైప్రవరమే చెల్లును.

ఆర్ష్టిషేణగోత్రము :-

ప్ర॥ భార్గవ, చ్యావన, ఆప్నవాన, ఆర్ష్టిషేణ, అనురూప (5. ఆప

ప్ర॥ భార్గవ, ఆర్ష్టిషేణ, అనురూప (3 ఆప)

ప్ర॥ భార్గవ, చ్యావన, ఆప్నవాన, ఐంద్ర, ఆర్ష్టిషేణ, (5. విఖ

☞ ఆర్ష్టిషేణులు, నైర్ఋతులు, గ్రామాయణులు మొదలగువారికి సుమారు ఇరువది గోత్ర భేదములు కలవు. వీరికిని పై గోత్ర ప్రవరమే చెల్లును. వత్స, విద, ఆర్ష్టిషేణ గోత్రీకులకు వివాహ సంబంధములు కూడవు. ప్రవరర్షులు కలియుట, అందఱు జామదగ్న్యులగుట కారణము.

వాత్స పౌరోధస :- } ప్ర॥ భార్గవ, చ్యావన, ఆప్నవాన, వాత్స, పౌరోధస (5. ఆప)

ప్ర. భార్గవ, వాత్స, పౌరోధస (3. ఆప)

వాత్స్య :- ప్ర. భార్గవ, చ్యావన, ఆప్నవాన (3 ఆప)

బైజవ : నైమథిత :- } ప్ర॥ భార్గవ, చ్యావన, ఆప్నవాన, ,, బైజవ, నైమథిత (5. బోధా)

☞ వత్స, విద, ఆర్ష్టిషేణ గోత్రీకులతో వీరికి సంబంధములు లేవు. వీరిలో ముగ్గురు ఋషులు కలియుట కారణము.

యాస్క :— భార్గవ, వైతహవ్య, సావేద (3. బోధా)

వాధూల, మౌన, మౌక :— శార్కరాక్షి, సార్ష్టి, దేవంతాయన, సావర్ణి శాలంకాయన, వైతహవ్య, మున్నగునవి సుమారు ఏబదిమూడు యాస్క గోత్ర భేదములు కలవు.

# గోత్ర ప్రవరమంజరి

మిత్రయువ :- ప్ర॥ వాధ్ర్యశ్వ (1. ఋషి)

ప్ర॥ భార్గవ, వాధ్ర్యశ్వ, దైవోదాస (3. ఋషి)

,, భార్గవ, దైవోదాస, వాధ్ర్యశ్వ (వికల్ప 3)

,, భార్గవ, చ్యావన, దైవోదాస. (3 ఋషి.)

☞ మిత్రయువులు, వైష్ట్యాయనులు, సాపిండినులు మున్నగు సుమారు ముప్పది మిత్రయువ గోత్రములవారు కలరు.

వైన్య
పార్థ
బాష్కల
శ్యేన
} ప్ర॥ భార్గవ, వైన్య, పార్థ (3. ఋషి)

అశ్వలాయన :- ప్ర॥ భార్గవ, వాధ్ర్యశ్వ, దైవోదాస (3)

శౌనక:- ప్ర॥ 1. గార్త్సమద (1. ఋషి)

,, 2. శౌనక (1. ఋషి)

,, 3. భార్గవ, గార్త్సమద (2. ఋషి)

,, 4. భార్గవ, శౌనహోత్ర, గార్త్సమద (3 ఋషి

☞ యాస్క, మిత్రయువ, శౌనక గోత్రములవారికిని జామదగ్న్య వత్సాదులతోను ఏకప్రవర సామ్యము మాత్రమే యున్నందున వివాహములకు నిషేధము లేదు.

వైదిక
విశ్వజ్యోతిష
} ప్ర॥ భార్గవ, వేద, వైశ్వజ్యోతిష (2. ఋషి)

శాఠర మాఠర: ప్ర॥- భార్గవ, శాఠర, మాఠర (3 ఋషి.)

☞ శాఠర, మాఠర గణములవారికి తమలో తమకే కాక భృగుగణముల వారందరితోను వివాహము నిషిద్ధము.

# ఆంగిరసగణము

ఆంగిరసులు మూడు విధములు. 1. గౌతమాంగిరసులు, 2. భారద్వాజాంగిరసులు, 3. కేవలాంగిరసులు.

గౌతమాంగిరసులు పదునాల్గు గణములు:- 1. ఆయాస్యులు, 2. శారద్వతులు, 3. కౌమండులు, 4 కాక్షీవంతులు 5. దీర్ఘతమసులు, 6. కరేణుపాలులు, 6. వామదేవులు, 7. ఔశనసులు, 8 రాహూగణులు, 9. సోమరాజకులు, 10 బృహదుక్థులు, 11. ఔచథ్యులు, 12. రాఘువ 13. వామదేవులు, 14. ఔశిజులు.

1. ఆయాస్య గౌతమ } ప్ర॥ ఆంగిరస, ఆయాస్య, గౌతమ (3. బోధా

☞ శ్రేణిపేధులు, మూఢరథులు మొదలగువారిలో పదునెనిమిదిమంది ఆయాస్య గోత్రభేదములు చెప్పుకొనుచున్నారు. వారందఱికిని పై ప్రవరము మాత్రమే చెల్లును.

2. శారద్వత:- ప్ర॥ ఆంగిరస, గౌతమ, శారద్వత(3.బోధా

☞ అభిజితులు, రౌహిణ్యులు, మున్నగు డెబ్బది గోత్రభేదములు కలవారున్నారు. వారందఱును శారద్వతగోత్రప్రవరమునే చెప్పుకొనవలెను.

3. కౌమాండ :- ప్ర॥ 1. ఆంగిరస, ఔతథ్య, కాక్షీవంత, గౌతమ, కౌమండ (5 బోధా)

2. ఆంగిరస, ఔతథ్య, గౌతమ, ఔశిజ, కాక్షీవంత(5 బో)

3. ఆంగిరస, ఆయాస్య, ఔశిజ, గౌతమ, కాక్షీవంత (5 బో)

మామంథరేషణులు, మాసురాక్షులు మొదలగువారిలో సుమారు పది కౌమండగోత్రభేదములు కలవు.

4. కాక్షీవంత:—4. ఆంగిరస, ఔశిజ, కాక్షీవంత, (౩ బో॰)

5. ఆంగిరస, ఔతథ్య, కాక్షీవంత (౩)

6. ఔతథ్య, గౌతమ, కౌమండ (౩)

5. దైర్ఘ్యతమస:—ప్ర॥ ఆంగిరస, ఔతథ్య, కాక్షీవంత, గౌతమ, దైర్ఘ్యతమస (5 బోధా)

ప్ర॥ ఆంగిరస, ఔతథ్య, దైర్ఘ్యతమస (౩. ఆశ్వ)

6. కారేణుపాల:—ప్ర॥ ఆంగిరస, గౌతమ, కారేణుపాల (౩)

వాస్తవ్యులు, శ్వేతీయులు మున్నగు గణములను సంబంధించిన సుమారు ఏడు కరేణుపాల గోత్రభేదములు కలవు.

7. వామదేవ్య:—ప్ర॥ 1. ఆంగిరస, వామదేవ్య, గౌతమ(౩)

2. ఆంగిరస, వామదేవ్య, బార్హదుక్థ (౩)

8. ఔశనస:—ప్ర॥ 1. ఆంగిరస, గౌతమ, ఔశనస (౩)

ప్ర॥ 2. ఆంగిరస, ఔశనస, గౌతమ (౩. విఖ)

✡ దిష్యులు ప్రశస్తులు మొదలగు గణములను సంబంధించినవి తొమ్మిది ఔశనస గోత్రభేదములు కలవు. వారెల్లరును పై ప్రవరమునే చెప్పుకొందురు.

9. రాహూగణ్య:—ప్ర॥ ఆంగిరస, రాహుగణ, గౌతమ (౩)

10. సోమరాజక—ప్ర॥ ఆంగిరస, సోమరాజక, గౌతమ (౩)

గౌతమ సంతానము బృహదుక్థ గోత్రీకులు.

11. బృహదుక్థ:—ప్ర॥ ఆంగిరస, బార్హదుక్థ, గౌతమ (౩)

1. ఆంగిరస, వామదేవ, బార్హదుక్థ. (౩ బోధా)

## గౌతమసంతానము అగు ఔచథ్యగోత్రీకులు

12. ఔచథ్య :-ప్ర॥ 1. ఆంగిరస, ఔచథ్య, గౌతమ (3.బో)
ప్ర॥ 2. ఆంగిరస, ఔచథ్య, ఔశిజ (మత్స్య. 3)

13. రాఘువ :-ప్ర॥ 1. ఆంగిరస, రాఘువ, గౌతమ (3. బో)
2. ఆంగిరస, గౌతమ, రాఘువ ( 3. ఆప)
గౌతమ గణములకు పరస్పర వివాహములు లేవు.

14. వామదేవ :-ప్ర॥ 1. ఆంగిరస, వామదేవ, బార్హాదుక్థ (3)
2. ఆంగిరస, గౌతమ, వామదేవ (3)
3. ఆంగిరస, వామదేవ, గౌతమ (3)
4 ఆంగిరస, బార్హాదుక్థ, వామదేవ (3)
5. అత్రేయ, ఆర్చనానస, వామదేవ (3)

## గౌతమ సంతానము ఔశిజ గోత్రీకులు

15. ఔశిజ :-1. ప్ర॥ ఆంగిరస, ఔశిజ, గౌతమ (3 ఆప)
2. ఆంగిరస, ఆయాస్య, ఔశిజ, గౌతమ, కాక్షీవంత

పై గౌతమగణములవారెల్లరు సగోత్రు లగుటచేతను ప్రవర సామ్యము ఉండుటచేతను పరస్పర వివాహసంబంధములు చేసికొనరాదు.

16. యాశ్నాయన :-ప్ర॥ ఆంగిరస, మాంధాతృ, కాథ్య (3)

భారద్వాజాంగిరసులు నాలుగుతరగతులవారు కలరు. వారిలో 1. భారద్వాజులు 2. గర్గులు 3. ఋక్షులు 4. కపులు.

భారద్వాజ:-ప్ర॥ ఆంగిరస, బార్హస్పత్య, భారద్వాజ(3)

భారద్వాజులు, శామ్యాయణులు, దేవాశ్వులు అనువారిలో నూట అరువదికంటె ఎక్కువ భారద్వాజ గోత్రభేదములు కలవు.

గార్గ్య :- ప్ర॥ ఆంగిరస, బార్హస్పత్య, భారద్వాజ. గార్గ్య, శైన్య (5. ఆప)

2. గార్గ్య :- ప్ర॥ ఆంగిరస, గార్గ్య, శై(న్య) వ్య.
ఆంగిరస, బార్హస్పత్య, గార్గ్య. (3)
భారద్వాజ, గార్గ్య, చవన (3)
ఆంగిరస, శైన్య, గార్గ్య (3 బో)
ఆంగిరస, గార్గ్య, శైన్య (3 బోధా)
భారద్వాజ, గార్గ్య, శైన్య (3 బోధా)

శృంగిభారద్వాజ:- ప్ర॥ శృంగి, కత, శైశిర (3)

గర్గులు, సాంభరాయణులు, సజీవనులు మున్నగువారివి సుమారు ఏబది గర్గగోత్రభేదము లున్నవి. వారెల్లరు గార్గ్య గోత్ర ప్రవరను చెప్పుకొనుచున్నారు.

ఋక్ష :- ప్ర॥ ఆంగిరస, బార్హస్పత్య, భారద్వాజ, వాన్దన, మాతవచస (5 బోధా)

*రౌక్షాయణులు, కపిలులు మొదలగు ఋక్ష గోత్రభేదములు తొమ్మిది కలవు. వీరికి పైగోత్రప్రవరలు చెల్లును.

కాపిస :-ఆంగిరస, అమహీయవ, ఋక్షయవ (3 బో)
ఆంగిరస, ఉరుక్షయ, ఆమహైయవ.

స్వతంత్రకపి :-ఆంగిరస, స్వతంత్రకపి, ఆమ(హైయ) హీయవ (3)

ఆంగిరస, ఆమహీయవ, ఉరుక్షయ (ఔఋక్షయ) 3.

స్వస్తితరులు దండులు మొదలగువారివి ఇరువదిఏడు నలువురు కపి గోత్రభేదములు కలవు. వారికి పయిగోత్రప్రవరము చెల్లును.

అగ్నివేశ్య :—ప్ర చూ. భారద్వాజ.

ఆత్మభువ :—ప్ర॥ ఆంగిరస, భారద్వాజ, బార్హస్పత్య, మాత్రవర, ఆత్మభువ (5 బోధా)

ద్విత్రిప్రవరసామ్యము ఉండుటచేతను సగోత్రత్వము పట్టుటచేతను పయి 9 భారద్వాజగణములవారికి పరస్పర వివాహసంబంధములు చెల్లవు. ఋక్షగణమందలి కపిలులకు విశ్వామిత్రులతో వివాహము కూడదు.

కేవలాంగిరసులు ఆఱు విధములు :— 1. హారితులు, 2 కుత్సులు, 3 కణ్వులు, 4. రథీతరులు 5. విష్ణువృద్ధులు 6. ముద్గలులు.

1. హారిత :—

పింగ, దర్భ, శంఖ, భై మగవ } ప్ర॥ ఆంగిరస, అంబరీష, యౌవనాశ్వ (3 బో)
మాంధాతృ, అంబరీష, యౌవనాశ్వ (3)

సౌభగులు, నయ్యాగవులు మున్నగువారివి సుమారు ఇరువది రెండు హారితగోత్రభేదములు కలవు. వారెల్లరు పైగోత్రప్రవరను చెప్పుకొందురు.

2. కౌత్స :—ప్ర॥ ఆంగిరస, మాంధాతృ, కౌత్స (యవ)

3. కాణ్వ :—ప్ర॥ ఆంగిరస, ఆజమీఢ, కాణ్వ. (3 బో)
ఆంగిరస, అజామిళ, కాణ్వ (3 ఆప)
ఆంగిరస, ఘౌర, కాణ్వ (3 బోధా)

ఔపమర్కటులు, భౌస్కరాయణులు మున్నగు గణములవారివి ఇరువదియొక్క కణ్వగోత్రభేదములు కలవు. వీరికి కాణ్వగోత్ర ప్రవరము చెల్లును.

పౌరుకుత్స
నితుందిల
శరమగ్న
5. విష్ణువర్ధన
} ప్ర॥ ఆంగిరస, పౌరుకుత్స, త్రాసదస్య (3. బోధా)

భద్రణులు, మద్రణులు, బాదరాయణ, ఔపమితి, ఔపగవి, సాత్యంకామి, అరుణి సాత్యకి మున్నగువారికి ఇరువది యెనిమిది విష్ణువృద్ధ గోత్ర భేదములు కలవు. వారికిని పైప్రవరమే చెల్లును.

4. రథీతర :- ప్ర॥ ఆంగిరస, వైరూప, పార్షదశ్వ (3బోధా)
,, ఆంగిరస, వైరూప, రాథీతర ,,
,, ఆంగిరస, పార్షదశ్వ, రాథీతర (3కాత్యా)
,, ఆంగిరస, పార్షదశ్వ, వైరూప (3బోధా)
,, అష్టాదంష్ట్ర, వైరూప, పార్షదశ్వ (3ఆశ్వ)

హస్తిదులు, నైతిరథులు మున్నగు గణములవారివి పదునాలుగు రథీతరగోత్రభేదములు కలవు. వారికిని పయి గోత్రప్రవరలే చెల్లును.

6. మౌద్గల్య:- ప్ర॥ ఆంగిరస, భార్మ్యశ్వ, మౌద్గల్య (3బోధా
,, తార్క్ష్య, భార్మ్యశ్వ, మౌద్గల్య ,,
,, ఆంగిరస, తార్క్ష్య, మౌద్గల్య ,,

సాత్యముగ్రియులు, హిరణ్యస్తంబులు మున్నగుగణములవారివి పదునెనిమిది ముద్గ గోత్ర భేదము లున్నను వారికి పయి ప్రవరమే చెల్లును. కేవలాంగిరోగణములవారగు ఆఱు గోత్రములవారును తమగణమును విడిచి మీదఁ జెప్పిన అన్ని గోత్రముల వారితోడను వివాహములు చేసికొనవచ్చును. (సగోత్రత్వము ప్రవరసామ్యము లేనందున) హారితకుత్సగోత్రీకులకు మాత్రము వివాహములు పనికిరావు.

సాంకృత్య:-ప్ర॥ ఆంగిరస, సాంకృత్య, గౌరివీత (3 ఆప)

పూతిమాషస : ఆంగిరస, గౌరివీత, సాంకృత్య (3 ఆర్ష)

రంకి :- } శాక్త్య, గౌరివీత, సాంకృత్య (3 ఆర్ష)

శంబు :- } శాక్త్య, సాంకృత్య, గౌరివీత (3 ఆప)

తైవగవ:- }

ఆక్షిల :-ప్ర॥ ఆంగిరస, బార్హస్పత్య, భారద్వాజ, కాత్య, ఆక్షిల

ప్ర॥ ఆంగిరస, కాత్య, ఆక్షిల (3 ఆప)

శౌంగతైశిర :- ప్ర॥ ఆంగిరస, బార్హస్పత్య, భారద్వాజ, శౌంగ, తైశిర (5)

ఆంగిరస, బార్హస్పత్య, భారద్వాజ, కాత్య, ఆక్షిల.

భారద్వాజ, కాత్య, ఆక్షిల. (3)

## ఆత్రేయ గణము

అత్రిగణమునకు చెందినవారు నాలుగు తెగలుగా ఉన్నారు. 1. అత్రులు 2. గవిష్ఠిరులు 3. వాద్భుతకులు 4. బాలేయులు.

1. ఆత్రేయ :- } ప్ర॥ ఆత్రేయ, ఆర్చనాన, శ్యావాశ్వ

శ్యావాశ్వ :- } (3 బోధా)

ధూమ్ర సంజ్ఞకులు, ఛాంది సంజ్ఞకులు మున్నగువారివి తొంబది నాల్గు అత్రిగోత్రభేదములు కలవు. వారెల్లరు ఆత్రేయగోత్రప్రవరమునే చెప్పుకొందురు.

2. గావిష్ఠిర:-ప్ర. ఆత్రేయ, ఆర్చనాన, గావిష్ఠిర (3. బో)

ఆత్రేయ, గావిష్ఠిర, పౌర్వాతిథ (3 బో)

గవిష్ఠిరులందు దక్షిసంజ్ఞికులు, భలందనులు మున్నగువారివి ఇరువది నాలుగు గవిష్ఠిరగోత్ర భేదములు ఉన్నవి. వారెల్లరు గావిష్ఠిరగోత్ర ప్రవరమునే చెప్పుకొందురు.

3, వాద్భుతక :-ఆత్రేయ, ఆర్చనాన, వాద్భుతక (3)

ముద్గల :-ప్ర. ఆత్రేయ, ఆర్చనాన, పౌర్వాతిథ (3)

ముద్గలులు, సంధినామకులు, అగ్నపులు అను వివిధ గణములవారివి పదివలకు ముద్గల గోత్రభేదములు కలవు. వారు ముద్గలగోత్ర ప్రవరము చెప్పుకొందురు.

అతిథేయ :-ప్ర॥ 1. ఆత్రేయ, ఆర్చనానస, అతిథ. (3. బో)

వామరథ్య :-ప్ర॥ 2. ఆత్రేయ, ఆర్చనానస, పౌర్వాతిథ(3)

బైజవాపి:-ప్ర॥ 3. ఆత్రేయ. ఆర్చనానస, గావిష్ఠిర (3బో

సౌమంగల:-ప్ర॥ ఆత్రేయ, సౌమంగల, శ్యావాశ్వ (3బో)

ధానంజయ:-ప్ర॥ ఆత్రేయ, ఆర్చనానస, ధానంజయ(3బో)

బాలేయ<br>పౌత్రిక } ప్ర॥ ఆత్రేయ, వామరథ్య, పౌత్రిక. (3. బోధా)

☞ గోత్రములకు ప్రవరర్షులకు సామ్య ముండుటచే అత్రిగణమువారందఱకు పరస్పరవివాహసంబంధములు లేవు. శాద్రేయులు, శౌవ్రేయులు వామరథ్యులు మొదలగుగణములవారు అత్రికి దౌహిత్రులగుట కారణము.

## విశ్వామిత్ర గణము

విశ్వామిత్రగణమువారు పదితెగలుగా ఉన్నారు.

1. కుశికులు, 2. లోహితులు, 3. రౌక్షకులు, 4. కామకాయనులు, 5. అజులు, 6. కతులు, 7. ధనంజయులు, 8. అఘమర్షణులు, 9. పూరణులు, 10. ఇంద్రకౌశికులు,

—: అఘమర్షణ ఋషి.సంతానము కౌశికగోత్రీకులు :—

కౌశిక<br>అఘమర్షణ } ప్ర॥ వైశ్వామిత్ర, అఘమర్షణ, కౌశిక. (3బో)

కుశికగణమునందు పర్ణజంఘులు వారక్యులు మున్నగువారివి సుమారు ఎబ్బది గోత్రభేదములు కలవు. వారెల్లరు కౌశిక గోత్ర ప్రవరము చెప్పుకొందురు.

దైవరాత<br>చైకిత<br>మానుతంతవ } వైశ్వామిత్ర, దైవరాత, ఔద (ర) (స) ల<br>వైశ్వామిత్ర, దైవరాత, దేవల (విఖ)

ఔలకి, వాలకి, యాజ్ఞవల్క్య, ఔలూక, బార్హదగ్న్య, బాభ్రవ, శావిసి, శాలావత, శాలంకాయన, కాలబవగోత్రముల వారెల్లరు దైవరాత గోత్రప్రవరము చెప్పుకొందురు.

లౌహిత:—ప్ర॥ వైశ్వామిత్ర, అష్టక, లౌహిత (రౌహిత) 3

రౌహిత:—ప్ర॥ వైశ్వామిత్ర, మాధుచ్ఛందస, అష్టక. (3బో

అష్టక:—ప్ర॥ వైశ్వామిత్ర, లౌహిత, అష్టక (3 ఆప)

ప్ర॥ వైశ్వామిత్ర, అష్టక (2 బోధా)

లౌహితులయందు కుడవక్యులు చక్రవర్ణాయసులు మున్నగు గణములవారివి అయిదు లౌహిత గోత్రభేదములు కలవు. వారు రౌహితులనియు పిలువఁబడుదురు. వారెల్లరు లౌహితగోత్ర ప్రవరమునే చెప్పుకొందురు.

రౌక్షక<br>రైవణ } ప్ర॥ వైశ్వామిత్ర, గాధిన, రైవణ (3 బోధా)<br>ప్ర॥ వైశ్వామిత్ర, రౌక్షక, రైవణ (3 బోధా)

వైశ్వామిత్ర
కామకాయన
శ్రామత
దైవతర
} ప్ర॥ వైశ్వామిత్ర, దైవశ్రవ, దైవతర. (3 బోధా)

వైశ్వామిత్రులు, దేవశ్రవసులు, దేవతరసులు మున్నగు గణముల వారివి అయిదు కామకాయనగోత్రభేదములు కలవు. వారు కామకాయన గోత్రప్రవరమునే చెప్పుకొందురు. కామకాయనులకే శ్రామతులను నామాంతరము కలదు.

ఆజ:—ప్ర॥ వైశ్వామిత్ర, మాధుచ్ఛందస, ఆజ (3 బోధా)
,, వైశ్వామిత్ర, ఆశ్మరథ, వాధూల (3 బోధా)
,, వైశ్వామిత్ర, ఆశ్మరథ, బంధుల, (కాత్యా 3)
,, వైశ్వామిత్ర, మాధుచ్ఛందస, ఆభ్యాజ్య (విఖ3)

కాత్య:—ప్ర॥ వైశ్వామిత్ర, కాత్య, ఆక్షీల. (3 బోధా)

ఔదుంబర, శైశిర మున్నగు గణములవారివి సుమారు ఇరువది కత గోత్రభేదములు కలవు. వారెల్లరు కాత్యగోత్రప్రవరమునే చెప్పుకొందురు.

ధానంజయ:—ప్ర॥ వైశ్వామిత్ర, మాధుచ్ఛందస, ధానంజయ
ప్ర॥ వైశ్వామిత్ర, మాధుచ్ఛందస, అఘమర్షణ (3బో)

పార్థివులు, బంధులులు మొదలగువారివి సుమారు ఏడు ధనంజయ గోత్రభేదములు కలవు. వారెల్లరు ధానంజయ గోత్రప్రవరమునే పఠింతురు.

అఘమర్షణ:—ప్ర॥ వైశ్వామిత్ర, అఘమర్షణ, కౌశిక (3బో)

పూరణ ఋషిసంతానము పౌరణగోత్రికులు.

పౌరణ } ప్ర॥ వైశ్వామిత్ర పౌరణ (2 బోధా)
వారిధాపయంత } ,, వైశ్వామిత్ర, దైవరాత, పౌరణ (3)
ప్ర॥ అగస్త్య, పౌర్ణమాస, పౌరణ

ఇంద్రకౌశిక:—ప్ర॥ వైశ్వామిత్ర, ఐంద్రకౌశిక (2 బోధా)

కాథక:—ప్ర॥ వైశ్వామిత్ర, కాథక (2)

ధనంజయ గణమునందు సతి పదునొకండు గణము లధికముగా జెప్పఁబడుచున్నవి. 1. ఆశ్మరథ్యులు. 2. సాహులులు, 3. గాధినులు, 4 వైణవులు, 5 హిరణ్యరేతసులు, 6. సువర్ణరేతసులు, 7 కపోతరేతసులు, 8. శాలంకాయనులు, 9. ఘృతకౌశికులు, 10 కథకులు, 11. రౌహిణులు

ఆశ్మరథ్య:—ప్ర॥ వైశ్వామిత్ర, ఆశ్మరథ్య, వాధుల (3 బో)

సాహుల:—ప్ర॥ వైశ్వామిత్ర, సాహుల, మాహుల (3)

గాధిన } ప్ర॥ వైశ్వామిత్ర, గాధిన, రైణవ (3)
రైవణ } ప్ర॥ వైశ్వామిత్ర, గాధిన, రైవణ (3 బో)

వైణవ:—వైశ్వామిత్ర, గాధిన, వైణవ (3 బో)

జాహ్నవ:—వైశ్వామిత్ర, శాలంకాయన, కౌశిక (3బో)

ఉదవైణవ:—వైశ్వామిత్ర, గాధిన, వైణవ (3 బో)

వైణవ:—ప్ర॥ వైశ్వామిత్ర, గాధిన, వైణవ (3 బో)

హైరణ్యరేతస:—ప్ర॥ వైశ్వామిత్ర, హైరణ్యరేతస (2)

సౌవర్ణరేతస:—ప్ర॥ వైశ్వామిత్ర, సౌవర్ణరేతస (2)

కాపోతరేతస:—వైశ్వామిత్ర, కాపోతరేతస (2)

శాలంకాయన, కౌశిక(3)
శాలంకాయన—ప్ర॥ వైశ్వామిత్ర, శాలంకాయన

శాలాక్ష }
లోహితాక్ష } చూ. శాలంకాయన

కాథక - వైశ్వామిత్ర, కాథక (2)

ఘృతకౌశిక—ప్ర॥ వైశ్వామిత్ర, ఘృతకౌశిక (2)

రౌహిణ—ప్ర॥ వైశ్వామిత్ర, మాధుచ్ఛందస, రౌహిణ(3 ఆ

గోత్రము. ప్రవరర్షి సామ్యము ఉండుటవలన వైశ్వామిత్ర గణము లకు పరస్పర వివాహ సంబంధములు లేవు. కుశికులకు జామదగ్న్యులకును పనికిరాదు. ధనంజయులకు ఆత్రిగణ విశ్వామిత్రగణములతో వివాహములు నిషిద్ధము. కతులకు భారద్వాజ విశ్వామిత్రగణములతో వివాహములు కూడవు.

## కశ్యప గణము

కశ్యపగణమువారు మూడు తెగలుగ నున్నారు.

(1) నిధ్రువులు (2) రేభులు (3) శాండిలిలు.

ప్ర. కాశ్యప. వత్సార, నైధ్రువ, రేభ, రైభ, శండిల, శాండిల్య (7)

కాశ్యపః ప్ర॥ కాశ్యప, ఆవత్సార, ఆసిత, 3 నిర్ణయసింధుమతము

నైధ్రువ—ప్ర. కాశ్యప, ఆవత్సార, నైధ్రువ (3 ఆప)

నిధ్రువులు, కశ్యపులు, శ్రష్టాంగీరసులు మున్నగువారివి నలుబదివరకు నిధ్రువ గోత్రభేదములు గలవు. వారికి నిధ్రువగోత్ర ప్రవరము చెల్లును. కాశ్యప గోత్రీకులు చాలమంది నిధ్రువ గోత్రము చెప్పుకొను చున్నారు. మరికొందఱు సప్తర్షేయము చెప్పుకొనుచుండుట కూడ వంశాచారమును బట్టియే కాని ఋషికర్తల నిర్ణయమని తోచదు.

వైశంపాయన, గోత్రీకులు నైధ్రువ ప్రవర చెప్పుకోవలెను.

రైభ్య:-ప్రి॥ కాశ్యప, అవత్సార, రైభ్య (3 ఆప)

శాండిల్య ,, 1) కాశ్యప, వత్సార, అసిత (3-బోధా)

,, 2) కాశ్యప, వత్సార, శాండిల్య (3-బోధా)

,, 3) కాశ్యప, వత్సార, దైవల (3-బోధా)

,, 4) కాశ్యప, దైవల, అసిత (3-ఆప)

,, 5) కాశ్యప, అసిత, దైవల (3-కాత్య)

,, 6) అసిత, దైవల, కాశ్యప (3-మ)

,, 7) అసిత, వత్సార, కాశ్యప (3-విఖ)

,, 8) శాండిల్య, అసిత, దైవల (3-ఆశ్వ)

,, 9) శాండిల్య, వత్సార, కాశ్యప (విఖ-3)

,, 10) దైవల, వత్సార, కాశ్యప (విఖ-3)

,, 11) దైవల, అసిత (2-ఆప)

,, 12) కాశ్యప, అవత్సార, నైధ్రువ, రేభ, రైభ

,, శండిల, శాండిల్య. (7) (ఆప)

కోపాలులు ఉదమేధులు మొదలగువారివి అలుపదివలుకు శాండిల్యగోత్రభేదములు కలవు. పై కశ్యపగణమువారికి గోత్రసామ్యము, ప్రవరర్షిసామ్యము ఉండుటచే పరస్పరము వివాహములు చేసికొనరాదు.

## వసిష్ఠగణము

వాశిష్ఠులు నాలుగు తెగలు.

1) వశిష్ఠులు 2) కుండినులు 3) ఉపమన్యులు 4) పరాశరులు

వాశిష్ఠ:-ప) 1) వాశిష్ఠ 2) ఇంద్రప్రమద 3) ఆభరద్వసు (3)

ప్ర (2) వాశిష్ఠ (1–బోధా)

వశిష్ఠులు, వైతాలక వినామకులనువారు అరువది వశిష్ఠ గోత్రభేదములు కలవారుగ నున్నారు. వారికి పై గోత్రప్రవరము చెల్లును.

ప్ర॥ (3) వాశిష్ఠ, ఇంద్రప్రమద, ఔపమన్యవ (3 వైఖా)

మైత్రావరుణ:– ప్ర॥ చూ. కౌండిన్య. భృగూర్ధ్వ, వార్ధేయశ్వ, మైత్రావరుణ.

కౌండిన్య:– ప్ర॥ వాసిష్ఠ, మైత్రావరుణ, కౌండిన్య (3–ఆపు)

కుండినులయందు లోహితాయనులు, గుగ్గులులు మొదలగుగణముల వారివి యిరువదియేడు కుండినగోత్రభేదములు కలవు.

ఔపమన్యవ:– ప్ర॥ వాసిష్ఠ, ఐంద్రప్రమద, ఆభరద్వసు (3)

,, వాసిష్ఠ, ఆభరద్వసు, ఐంద్రప్రమద (3)

,, వాసిష్ఠ, ఆభరద్వసవ్య, ఐంద్రప్రమద, (పాఠాంత॥)

ఆభరద్వసు, వాసిష్ఠ, ఐంద్రప్రమద (3)

ఔదలేయులు, మాండలేఖులు మున్నగు గణములవారివి సుమారు డెబ్బది ఉపమన్యుగోత్రములు కలవు. వానికిని పైప్రవరము చెల్లును.

పారాశర్య— ప్ర॥ వాసిష్ఠ, శాక్త్య, పారాశర్య (3 బోధా)

వాజిసంజ్ఞగలవారికి నలువదియేడు పరాశరగోత్రభేదములు కలవు. వానికిని పై ప్రవరము చెల్లును. వాసిష్ఠగణమువారికి పరస్పరము వైవాహిక సంబంధములు పనికిరావు.

## అగస్త్యగణము

అగస్త్యగణము పది తెగలు కలదిగా నున్నది.

1) ఇధ్మవాహులు 2) సాంభవాహులు 3) సోమవాహులు

4) యజ్ఞవాహులు 5) దర్భవాహులు 6) సారవాహులు
7) అగస్త్యసంజ్ఞికులు 8) పూర్ణమాసులు 9) హిమోదకులు
10) పాణికులు.

అగస్త్య ఇధ్మవాహ } ప్ర 1) అగస్త్య (1–బోధా)
2) అగస్త్య, దార్ఢ్యచ్యుత, ఇధ్మవాహ (3ఆప
3) అగస్త్య, గార్గేయ, విద్యున్నత

ఇధ్మవాహులు, విశాలాద్యులు, స్థాలనాయనులు మొదలగు గణములవారికి సుమారు ఏబది ఇధ్మవాహగోత్రభేదములు కలవు.

సాంభవాహ:–ప్ర. అగస్త్య, దార్ఢ్యచ్యుత, సాంభవాహ (3)
సోమవాహ:–ప్ర. అగస్త్య, దార్ఢ్యచ్యుత, సోమవాహ (3)
యాజ్ఞవాహ:–ప్ర అగస్త్య, దార్ఢ్యచ్యుత, యాజ్ఞవాహ (3)
దార్భవాహ:–ప్ర. అగస్త్య; దార్ఢ్యచ్యుత, దర్భవాహ (3)
సారవాహ:–ప్ర. అగస్త్య, దార్ఢ్యచ్యుత, సారవాహ (3. బోధా
అగస్త్య:–ప్ర. అగస్త్య, మాహేంద్ర, మాయోభువ (3)
పౌర్ణమాస:–ప్ర. అగస్త్య, పౌర్ణమాస, పారణ (3–బోధా)
హైమోదక:–ప్ర అగస్త్య, హైమచర్చి, హిమోదక (3 బోధా
పాణిక:–ప్ర. అగస్త్య, వైనాయక, పాణిక, (3 బోధా)

అగస్తి గణములకు చెందినవారలకు పరస్పరము వివాహసంబంధములు లేవు. గోత్రసామ్యము, ప్రవరర్షి సామ్యము ఉన్నందున.

సాంఖ్యాయన:–అగస్త్య, అఘమర్షణ, సాంఖ్యాయన (3)
శౌంగశైశిరి (ద్వ్యాముష్యాయణుడు):–ఆంగిరస, బార్హస్పత్య, భారద్వాజ, శౌంగశైశిరి (5–బోధా)

ప్ర॥ 2) ఆంగిరస. బార్హస్పత్య, భారద్వాజ, కాత్య
ఆక్షీల (5-బోధా)

ప్ర॥ 3) ఆంగిరస, కాత్య, ఆక్షీల (3—బోధా)

☞ ఈగోత్రముల వారికి భారద్వాజులతోడను, విశ్వామిత్ర గణము వారితోడను వివాహములు లేవు.

కాపిలః— } ప్ర) ఆంగిరస, గారివీతి, సాంకృత్య (3. బోధా
కాత్యః— } ప్ర. శాక్త్య, గారివీతి, సాంకృత్య (3-బోధా
సాంకృత్యః— } ప్ర. శాక్త్య, సాంకృత్య, గౌరివీతి
పూతిమాషః—

లౌగాక్షిః—ప్ర. కాశ్యప, వత్సార, వాశిష్ఠ (3. బోధా)
,, కాశ్యప, వత్సార, అసిత (3. బోధా)

పూతిమాషులు, తడిసంజ్ఞకులు అనువారిలో ఇరువది ఎనిమిది సంకృతి గోత్రభేదము లున్నవి. వారికి పై ప్రవరము చెల్లును.

వీరికి తమగణము వారితోడను, వాసిష్ఠులు, శౌంగశిశిరులు, లౌగాక్షి అనుగోత్రముల వారితోడను వివాహసంబంధములు లేదు. లౌగాక్షిగోత్రము వారికి వాసిష్ఠులతోడను, కశ్యపగణము వారితోడను వివాహములు లేవని కొందఱి మతము.

దేవరాతగోత్రికులకు జామదగ్న్యులతోడను విశ్వామిత్రగణము వారితోడను వివాహసంబంధములు కూడవని కొందఱిమతము. భార్గవగోత్రీకులకు, దేవరాతగోత్రీకులకు భార్గవులతో కూడదు. ధనంజయ గోత్రము వారికి విశ్వామిత్ర, అత్రిగణముల వారితో వివాహములు లేవు. జాతుకర్ణులకు వసిష్ఠగణముతోడను అత్రిగణముతోడను వివాహములు కూడవు.

కపి, గర్గ, భారద్వాజ, కాత్యాయనగోత్రీకులు ప్రవరసామ్యము గోత్రసామ్యము ఉండుటచేత పరస్పరము వివాహములు చేసికొనరాదు. ఈ నియమావళి బోధాయన ప్రవరఖండమున వ్రాయబడినది.

దర్భాయణులు మొదలగువారిలో ముప్పది యెనిమిది లౌగాక్షి గోత్రభేదములు కలవు. వారెల్లరు లౌగాక్షి గోత్రప్రవరమును చెప్పుకొందురు. వీరికి అహర్వసిష్ఠులు, నక్తంకాశ్యపులు అను పేరు కలదు.

ప్రవర తెలియని విప్రుడు తన ఆచార్యుని ప్రవరమును చెప్పుకోవలెను. అదియు తెలియనివాడు ''మానవ'' (ఆప) అను ఏకార్షేయగోత్ర ప్రవరమును చెప్పుకొనవలెను.

క్షత్రియులు:- పురోహిత ప్రవరము చెప్పందగును. లేక

ప్ర॥ మానవ, ఐడవ, పౌరూరవస (ఆప)

,, మానవ, ఐ(ల)ద్ధ, పౌరూరవస (ఆప)

వైశ్యులు:-ప్ర 1) వాత్సప్రి (1.ఆప)

,, 2) మానవ (1.ఆప, కాత్యా)

,, 3) భాలందన, వాత్సప్రి, మాంకిల (3.ఆశ్వ బోధా,విఖ)

,, 4) పురోహిత ప్రవరము.

గోత్రప్రవరలు తెలియనపుడు సర్వవర్ణములవారును ప్ర॥ 'మానవ' (ఆప. బోధా) అని చెప్పుకోవలెనని ఆపస్తంబ బోధాయనాది సూత్రకర్తలు విధించిరి.

1) అజ్ఞానవశమున గోత్రసామ్యముగల కన్యను పెండ్లి చేసికొన్నట్లు తెలిసిన దోషపరిహారమునకై చాంద్రాయణవ్రతమును ప్రాయశ్చిత్తముగా చేసికొనవలెను,

ఆస్త్రీని ధర్మకార్యములందును భోగాదులందును విడిచి తల్లినివలె అన్నాదులిచ్చి పోషింప వలెను.

2) ఒకని కన్యను తనపుత్రునకును, తనకన్యను తిరిగి అతనిపుత్రునకును వినిమయముగా నిచ్చి పెండ్లిండ్లు చేయుటను కుండమార్పు పెండ్లిండ్లని చెప్పుదురు. ఇది నిషిద్ధము. కాని పెండ్లిండ్లు చేయలేనంతటి దుర్భర దారిద్ర్యావస్థలో మాత్రము ఆపద్ధర్మముగా అంగీకరింపఁబడినది.

3) ఒకవరునకు తనకన్యల నిరువురనిచ్చి పెండ్లి చేయరాదు. కాని మొదటిభార్య మృతిపొందినచో ఆమె చెల్లెలినిచ్చి పెండ్లిచేయవచ్చును.

4) ఏకగర్భజనితులగు అన్నదమ్ములకు తన ఔరసపుత్రికలను అప్పచెల్లెండ్రనిచ్చి వివాహము చేయరాదు. సోదరులుకాని, సోదరీమణులు కాని సవతిబిడ్డలగుచో నిషేధములేదు.

5) ఒకకుటుంబమున ఏకగర్భజనితులగు అన్నదమ్ములకు సమానసంస్కారములు (వివాహము, ఉపనయనములు ఆరుమాసములలోపున పనికిరాదు. (పక్షాంతరమున) సంవత్సరభేదము కలిగినచో చేయవచ్చును.

6) అప్పకు చెల్లిలికిగాని, అన్నకు చెల్లెలికిగాని, అప్పకు తమ్మునకుగాని ఆరుమాసములలోపున వివాహము చేయరాదు. (భిన్నోదరులైనచో చేయవచ్చును.)

7) ఒకే కుటుంబమున ఆరుమాసములలోగా మూఁడు శుభకార్యములు (వివాహోపనయనములు) చేయకూడదు. భిన్నోదరులయినచో అగ్నికార్యములు మూఁడైనను దూష్యముకాదు.

8) కుమారుని వివాహమైన పిదప ఆరుమాసములలో పుత్ర కుమార్తె పెండ్లి చేయరాదు. భిన్నోదరులైనచో అది దూష్యముకాదు.

9) గృహనిర్మాణము, పెండ్లి ఒకేసంవత్సరములో పనికిరాదు. గృహప్రవేశమైన పిదప పెండ్లి చేసినచో దూష్యముకాదు. ఇంతకు మించి ధర్మసందేహము లేమైన ఉన్నచో ధర్మసింధువు చూడనగును.

—0—